# లోకపావనశతకము

---

ఇది

ఆదిపూడి సోమనాథరావుచే

రచింపఁబడి.

మానవసేవాపత్రికయందు

ప్రకటింపఁబడియె.

---

రాజమహేంద్రవరము.

శ్రీ మనోరమా, బ్రౌన్ ఇండస్ట్రియల్ మిషన్ ముద్రాక్షరశాలలయందు

ముద్రింపఁబడియె.

1911

వెల 2 అణాలు.

శ్రీ

# లోకపావనశతకము.

ఉ. శ్రీరమణీయమూర్తి వయి ♦ శిష్టముముక్షుజనానువర్తివై
చారువిశాలకీర్తి వయి ♦ సర్వమునీంద్ర హృదబ్జవర్తివై
కూరిమి మీఱఁగా భువన ♦ కోటుల [illegible]
సారెకు వెల్గుచుంటివదు ♦ సజ్జనజీవ[illegible]! లోకపా[illegible] ౧

ఉ. చంపకమాలికల్ మఱియుఁ ♦ జక్కని యుత్పలమాలికల్ గడున్
సొంపులు గుల్క నొక్కకృతిఁ ♦ జొక్కపు భక్తిని గూర్చి నీకిదే
యింపుగ నప్పగింతుఁ బర ♦ మేశ దయన్ గయికొమ్ము రమునా
సంపదయెల్ల నీవె కద ♦ సజ్జనజీవన! లోకపావనా! ౨

ఉ. శ్రీకరము న్విచిత్రమగు ♦ సృష్టి నొనర్చి చెలంగు నీదు శో
భాకృతి యోగిరాడ్తతి స ♦ మంచితరీతి సమాధిఁ జూచి నిన్
నాకధునీప్రవాహముల ♦ నవ్వేఁదు వాగ్ఝరుల న్నుతించు నీ
శా! కవిలోకమూలధన! ♦ సజ్జనజీవన! లోకపావనా! ౩

చ. నిరతము నీవినోదములె ♦ నిర్మలబుద్ధికిఁ దోఁచుచుండుటన్
నిరుపమగీతిజాతముల ♦ నీగుణగానముఁ జేయు చాత్మలో
గురియగు నిన్నుఁ గాంచి ఋషి ♦ కూటము గంతులువైచి యాడెడిన్
సరసమనోహరా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! ౪

ఉ. ఆశ నిరాశయౌ తఱిని ♦ నద్భుతరీతిని నాస గొల్పు స
ర్వేశ! భవద్విచిత్రముల ♦ నెల్లను జూచి మునీంద్రు లంద ఱా
వేశముచేత నీయశము ♦ వింతగఁ బాడి సుఖించుచుందు రీ
శా! శరణాగతాభయద! ♦ సజ్జనజీవన! లోకపావనా! ౫

చ. తమగతిఁ దప్పకుండఁగ స ♦ దా గ్రహణంబులు ధూమకేతువుల్
క్రమముగఁ దోఁచుచుండుటను ♦ గాంచి బుధుల్ గడుఁ జోద్యమందుచున్
బ్రమదముమీఱ నీ నియమ ♦ పాలిని బాడుచునుంద్రు భక్తిలో
శమదమభూషితాత్ములయి ♦ సజ్జనజీవన! లోకపావనా! ౬

ఉ. ఆకసమందుఁ బక్షులు ♦ మందముగా విహరించునట్లు లీ
లోకచయమ్ము నీకడుపు ♦ లోపల వింతగ సంచరించుచున్

వాకొనుచుండు నీమహిమ ♦ వారికి యెప్పుడు వేయినోళ్లతోఁ
జోకగఁ జెప్పనౌనె నిను ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 7

ఉ. చల్లనికీర్తిచంద్రికలఁ ♦ జల్లుచు లోకము లేలుచున్ననో
వల్లభ ! నీప్రభావమునఁ ♦ బాపచయంబుల నెల్లద్రుంచి వ
ర్ధిల్లుచు భక్తిభావమున ♦ దివ్యతరస్తుతి పుష్పమంజరుల్
చల్లగనిమ్ము నీపయిన ♦ సజ్జనజీవ ! లోకపావనా ! 8

ఉ. అందఱు స్వేచ్ఛ మీఱఁగ వి ♦ హారము సల్పెడు నందనంబుగా
సుందరమౌ వసుంధరను ♦ సూరులు మెచ్చ రచించినావు నీ
యందము చూడ మిందుఁ గని ♦ హర్షసుధాంబుధిఁ దేలి మేము నీ
సాంద్రయశంబు బాడుటకు ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 8

చ. అణువులకంటె సూక్ష్ముఁడవె ♦ యంతట నెట్టులు నిండినావు ? మా
కనులకు గానరావె పలు ♦ కాంతులఁ జిమ్మెడు సూర్యకోటులన్
ఘనమతి ! యెట్లు చేసితివి ? ♦ గాంచఁగ నీపను లెల్ల వింతలా
సనకసనందనాదినుత ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 10

ఉ. చందురు శైత్య మెంత మఱి ♦ సంద్రములోపలి లోతదెంత పే
రొందిన గ్రీష్మభానుని స ♦ ముజ్జ్వలభీష్మప్రతాప మెంత నీ
యందలి సీతు లోతులకు ♦ వారని వేడికి ముందు విస్ఫుర
త్సాంద్రయశోమహావిభవ ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 11

ఉ. నీ వొకపారి యూఁ ! అనిన ♦ నీరధు లెల్లఁ గలంగి పారెడున్
దావకృశానుఁ డెంతయును ♦ దర్పము మీఱి జగంబు మ్రింగెడున్
భూవలయంబు చూర్ణమయి ♦ పోవఁగ వీచును జండవాతముల్
స్థావర మెల్ల రూపడఁగు ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 12

చ. నను నిలు గట్టిపెట్టితివి ♦ నాబల మెల్లను గ్రుంగిపోయెడిన్
దినములవెన్ని నే నిటులు ♦ దీనుఁడనై పడియుందుఁ జెప్పవే
యని మొఱ నీకుఁ బెట్టెడిక్రి ♦ యన్ గడు ఘోషిలు సంద్ర మెప్పుడున్
స నియమశక్తిసంభరణ ! ♦ సజ్జనజీవన! లోకపావనా ! 13

ఉ. భూతము లన్ వరాశ్వములఁ ♦ బొందికతో నొడఁగూర్చి లోక మన్
ఖ్యాతరథంబు నీవు గడ ♦ కన్నడిపింపఁగ మేము హాయిగా
భీతిని మాని నీకృపకు ♦ భృత్యులమై సుఖమున్నవార మీ
శా ! త్రిజగన్నుతైకయశ ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 14

ఉ. పిల్లలు మేము నీ కృపను ♦ బెల్లుగ నాటిల నాఁడు కొంటకై
యెల్ల పదార్థము ల్గలుగ ♦ నిల్లుగ భూమి నలంకరించి మా
యుల్లము పల్లవించు నటు ♦ లొప్పుగ వింతలఁ జూపుచుందువా
సల్లలితప్రశ స్తగుణ ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 15

ఉ. బాలుర మయ్య మేము మరి ♦ పాఠము సెప్పు గురుండ వీవు నీ
పాలికి నైన లోక మిది ♦ భవ్య తరం బగు పాఠశాలనే
మేల భవ త్ప్రబోధనమున ♦ నిద్ధ చరిత్రుల మౌదుమయ్య యీ
శా ! లలితప్రభాకలిత ! సజ్జనజీవన ! లోకపావనా ! 19

ఉ. ఎల్లఱి నీదు గర్భమున ♦ నెల్లపుడున్ వహియించి యుంచుటన్
గొల్లగ భోజ్యవస్తువులఁ ♦ గూరిమితోఁ నొడఁ గూర్చు చుంచుటన్
జెల్లుగ నీ కృప న్మెదివి ♦ కీడని మాపికఁ బెంచుచుంచుటన్
జల్లని తల్లి వీ వెకద ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 17

ఉ. అందఱు మమ్ము వీడి చను ♦ నప్పుడు మా వెనువెంట నుండి మా
డెందములోని కుందులను ♦ డిందఁగఁ జేసి కడింది ప్రేమతో
ముందును వెన్కఁ దోడగుచు ♦ మోదముఁ గూర్చెడు మిత్రుఁ డీవెగా
చందన శీతలా ! విపుల ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 18

చ. అకలుష ! భ క్తవత్సల ! ద♦యామయ ! నీవు భవాబ్ధి పోతమై
ప్రకట జగత్త్రయంబునకు ♦ బంధువవై పరమోపకారివై
త్రికరణ శుద్ధిగాఁ గొలుచు ♦ ధీరులకుం గడుఁ దోడు నీడ వై
సకలమున న్వెలింగెదవు ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 19

ఉ. సర్వము నీ దయం గలుగు ♦ సంగతి భక్తుఁ డెఱుంగుఁ గానఁ దా
గర్వము మాని సర్వమును గానుకగ నీకు నొసంగి యాత్మలోఁ
బర్విన వేడ్కఁ సుస్థిరముఁ ♦ బాయక నల్పుచు నుండు నిత్యమున్
సర్వశుభప్రదా ! సకల ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 20

ఉ. సంతత మంత రంగమున ♦ సత్య పథంబును జాటి చూపుదున్
చింతగ సంతయున్ దెలిసి ♦ చేయువిధంబులఁ బ్రీతిఁ బ్రోచుచున్
పంతముతోడ నంద ఆని ♦ పట్టి సుమార్గము నందె పెట్టుచున్
సంతస మందుఁ దేల్చెదవు ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 12

# మానవసేవ.

ఉ. సత్యము నీ స్వరూప మని ♦ స్వాంతములోఁ దలఁపోసి సత్యమున్
సత్యవచో విహారమున ♦ సర్వము నర్పణ సేయు నట్టి యా
సత్య ప్రతాప శీలుర ప్రశాంత మనస్కుల సత్య కీర్తికిన్
సత్యము నీవె కారణము ♦ సజ్జనజీవన! లోకపావనా! 22

చ. దురితము లొక్కకట్టం బయికి ♦ ధూఁకగ నెంచిన యప్పు డాత్మలోఁ
బురుషము పూని యన్నిటిని ♦ బారగఁ దోలెడు శక్తి నీదు సం
స్మరణము చేతఁ గల్గు నది ♦ సత్యము సత్యము సత్యమంచు నీ
చరణము నంటి చెప్పఁ గల ♦ సజ్జనజీవన! లోకపావనా! 23

చ. పరమకృపాళు వౌ కతనఁ ♦ బాపదవాగ్నిని గ్రాగు వారలన్
గర మనురక్తి నెత్తి కడ ♦ కన్గరుణాయత వీక్షమాలికల్
బఱపి ప్రశాంత చిత్తులుగ ♦ భాసిలఁ జేయుచు నుందు వౌర నీ
శరణమె శాంతికారణము ♦ సజ్జనజీవన! లోకపావనా! 24

చ. దురిత దవాగ్ని దూఁకితిని ♦ దుఃఖపరంపరలందుఁ గ్రాగితిన్
దరి గన రాక కుందితిని ♦ దర్పము దక్కితి నీకు మ్రొక్కితిన్
గురిసి భవత్కృపామృతము ♦ గొబ్బున శాంతిని గూర్ప వేఁడితిన్
శరణము చొచ్చితిన్ వినుము ♦ సజ్జనజీవన! లోకపావనా! 25

చ. మనసును జొచ్చి చూచెదవు ♦ మాటలచే నిను మోసపుచ్చఁగా
నను వగునే పరాత్పర సమంచిత చారు చరిత్ర నీకు నా
మనసును విప్పి చూపెదను ♦ మానక నన్నుఁ గృతార్థుఁ జేయవే
చనవున నిన్నె చేరితిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 26

ఉ. మీఱితి నీదు నాజ్ఞలను ♦ మేలును గీడును నెంచ కెంతయున్
జాఱితిఁ బాపకూపమున ♦ జన్మము దుఃఖము పాలు చేసితిన్
జేరితిఁ గావు కావు మని ♦ చేతులు మోడ్చితి దీనుఁడైతి వే
సారితి నింక నీవె గతి ♦ సజనజీవన! లోకపావనా! 27

చ. అతుల విచిత్ర లోకముల ♦ నద్భుతరీతి సృజించి ప్రోచు నీ
ప్రతిభకు నన్నుఁ గాచు టొక ♦ భారమె యౌ కరుణాపయోనిధీ!
మతి నిను నెంచి సంతటనె ♦ మాని వెతన్, సుఖియించు నెంతయున్
సతతము నీవె నాకు గతి ♦ సజ్జనజీవన! లోకపావనా! 28

ఉ. చింతలు పైపయిన్ బొదివి ♦ చెచ్చెరఁ గీలలఁ బోలె నంటినన్
బంతముతో రుజావళులు ♦ పట్టి పొరింబొరి బెట్టుఁ దాఁకినన్
వింతఁగ శాంత మై మఱలు ♦ విశ్వవిభుం డగు నిన్ స్మరించినన్
శాంతినికేతనా! సకల♦సజ్జనజీవన ! లోకపావనా ! 29

ఉ. ఘోరవిపత్సముద్రమునఁ ♦ గూలినవారికి నీకటాక్షమే
పారముఁ జేర్చునావ కద ! ♦ భక్తచకోరకపాళికి న్సదా
పారణపూర్ణచంద్రికయుఁ ♦ బాపవిమోచనధారయుం గదా !
చారుకృపాసుధాసదన ! సజ్జనజీవన ! లోకపావనా ! 30

ఉ. భూతలమందుఁ బ్రాణులను ♦ భూరివిపద్దశ నొందఁజేయుచున్
ఘాతుకులై మెలంగు నప♦కారవిహారుల నీతిమూశలన్
బ్రాతిగ శిక్షసేయునెడ ♦ భవ్యతరం బగు నీకటాక్షమే
శాతకృపాణమై తనరు సజ్జనజీవన ! లోకపావనా ! 31

చ. నిరతము నీదనామృతము ♦ నిండి జగంబునఁ బర్వుచుండియున్
దురితమునన్ బ్రవృత్తులగు ♦ దుష్టులబుద్ధికి గోచరించునే ?
మతిమతిఁ బైపయిన్ గవియు ♦ మంటుగఁ దాఁ గనుపించుఁ గాక, యీ
శ్వర ! సుఖపూర ! పాపహర ! సజ్జనజీవన ! లోకపావనా ! 32

ఉ. పారెదఁ బాపపంకమున ♦ జారెద మూర్ఖుల మమ్ము నెత్తుచున్
దీరనిప్రేమతోఁ దుడిచి ♦ దిద్దుచునుందువు, కొంచెమైన వే
సారవు, నీక్షమాగుణము ♦ సన్నుతిసేయఁగ మాకు శక్యమే ?
చారుకృపామహాభరణ ! సజ్జనజీవన ! లోకపావనా ! 33

ఉ. నీకరుణావలోకనము ♦ నిచ్చియ దెవ్వనిమీఁదఁ బొల్చునో,
లోకము లెల్ల వానికి ♦ లొగ్గి నమస్కృతి సేయు, వాఁడ ద
స్తోకమనీషతో వెలుఁగు, ♦ దోఁగుచునుండు సుఖాబ్ధిలోన, నీ
శా ! కరుణానివేశయశ ! సజ్జనజీవన ! లోకపావనా ! 34

చ. దయ హృదయాంబరస్థలిని ♦ దద్దయుఁ బూర్ణసుధాంశు మించెడున్
దయ హృదయాంబుజాతమునఁ ♦ దన్మకరందముగా స్రవించెడున్
దయ హృదయాభ్రసంజనిత♦ధన్యతమామృతవృష్టియై చనున్
స్వయమగు నీప్రభావమున ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 35

ఉ. శిష్టులసద్గుణంబ బనెడు ◆ చెన్నుపసిండి మెఱుంగుదేఱఁగా
కష్టము వెట్టి రాచెదవు ◆ కానఁగ లేరుగ నీప్రభావముల్
నష్టమతుల్ ప్రపంచమున ◆ నాథ! భవత్కరుణావిశేషముల్
స్పష్టములౌను సాధులకె ◆ సజ్జనజీవన! లోకపావనా! 36

చ. తరిచినకొద్ది వెన్న దధిఁ దగ్గును గాని జగంబులో నినున్
దరిచినకొద్ది నీకరుణ ◆ తద్దయు వర్ధిలి కానుపించు, నిన్
దలఁగనివాని నెవ్వఁడు స◆దా మదిఁ గొల్చునో, వాఁడె ధన్యుఁడై
సరగున ముక్తిఁ జూఱఁగొను సజ్జనజీవన! లోకపావనా! 37

ఉ. సృష్టిని జూచి, నీమహిమ ◆ చిత్తములోఁ దలఁపోసి పోసి, నీ
క్లిష్టము లేనివానికడ ◆ కింతయుఁ బోవక త్రోసి త్రోసి, యే
కష్టము వచ్చినన్ విడక ◆ గ్రక్కున నీపని చేసి చేసి, నిన్
స్పష్టముగాఁ గనంగ నగు ◆ సజ్జనజీవన! లోకపావనా! 38

చ. వదలక నీవు సర్వమున ◆ వ్యాపకుఁడై విలసిల్లినావు; నీ
యుదరమునందు సర్వము మ◆హోత్తమరీతి వసించు, నైన స
మ్మదమున భక్తు లందఱును ¦◆ పూతచరిత్రుని బూజ్యు నిన్ను హృ
త్సదనములందె చూచెదరు ◆ సజ్జనజీవన! లోకపావనా! 39

ఉ. చిత్రవిచిత్రయంత్రములఁ ◆ జెన్నలరారెడు దేహయంత్రమున్
బుత్రుల మంచు మాకుఁ బరి◆పూర్ణదయన్ దయచేసినావు; నీ
చిత్రము లెల్లఁ జూచి నిరు◆ జిత్తములోఁ గని పొంగి కొల్వఁ, నీ
శా! త్రిజగత్పవిత్రకాశయశ! ◆ సజ్జనజీవన! లోకపావనా! 40

చ. రవికిని జుట్టు భూమియును ◆ రమ్యముగా భువిచుట్టుఁ జంద్రుఁడున్
భువి తనచుట్టుఁ దాఁ దిరిగి ◆ పొల్పుగ వత్సర మాస వాసరా
లవనిని గల్గఁజేయును మ◆హాద్భుతరీతిని నీదు శాసన
స్తవ మొనరించుచున్ సతము ◆ సజ్జనజీవన! లోకపావనా! 41

ఉ. వింతఁగ భూవిమానమున ◆ విశ్వవిభూ! మము నుంచి మింటిపై
నెంతయు వేడ్కఁ ద్రిప్పెద వ◆దేమి విచిత్రమొ? త్రిప్పినట్టు లా
కింతయుఁ గానరా దహహ! ◆ యెన్నఁ దరంబె భవత్ప్రభావముల్?
సంతతసౌఖ్యహేతువులు ◆ సజ్జనజీవన! లోకపావనా! 42

ఉ. ఆకసమున్ బటంబున మ ♦ హాద్భుతరీతి మహేంద్రచాపమున్
శ్రీకమనీయవర్ణములఁ ♦ జిత్రతరంబుగ ఱెప్పపాటులో
నే కలిగించి చూపెద వ ♦ దెంతటిచిత్రపు వ్రాతకాఁడ వీ
శా! కమనీయశుభ్రయశ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 43

చ. రవి దివి వచ్చి పోవుతతి ♦ రాజిలు చిత్రపటంబులో యనన్
బ్రవిమలకాంతు లీనెడు ప్ర ♦ భాతరుచుల్ మఱి సాంధ్యరాగముల్
దవిలి నభోంగణాపణి స ♦ దా నినుఁగూర్చి రచించి వ్రాయు సం
స్తవకవితాప్రభావములు ♦ సజ్జనజీవన! లోకపావనా! 44

ఉ. వారిధిలోని నీరమును ♦ బాష్పవిధంబునఁ బీల్చి దానినే
వారక వారిదాకృతిగ ♦ వర్ధిలఁజేసి సువృష్టి భూములం
జారుతరంబుగాఁ గురియు ♦ చక్రనియంత్రము భాస్కరుండు నిన్
సారెకుఁ జాటుచుండెడిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 45

ఉ. చీఁకటిఁ జిమ్మ నీ వదరి ♦ చెంగు ఫిరంగి గడంగి కాల్చినన్
బ్రాకటమైన తెల్లపొగ ♦ పర్వె నసంగను బూర్వదిక్కునన్
వేఁకువఁ దెల్లవాఱు రవి ♦ బింబము వచ్చెను గుండుఁభాతి నీ
శా! కమనీయభూరియశ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 46

ఉ. తెం డని మీఁదఁ జే వయిచి ♦ లీలగఁ జూచెడుమాడ్కిఁ దోఁపగా
నండజముల్ రొద ల్సలుపు, ♦ హాయిగఁ జల్లనిగాలి వీచు మా
ర్తాండునిరశ్మి పైపయిని ♦ దద్దయుఁ బర్వు ప్రభాతవేళ నీ
చండతరప్రభావమున ♦ సజ్జనజీవన! లోకపావనా! 47

చ. ఉదయమునందు లేచి నిను ♦ నుజ్జ్వలభక్తి భజించువారికిన్
హృదయము సద్గుణంబులకు ♦ నెంతయు నాకరమై చెలంగెడున్
మదముఖదుర్గుణావళులు ♦ క్రుంగి నిరంతరశాంతి యబ్బెడున్
నవమలశాసనా! సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 48

ఉ. తెల్లగ వెల్గు వేవెలుగు ♦ వేడికి మందుగఁ గంటి విందుగాఁ
జల్లగఁ బైపయిన్ సుధలఁ ♦ జల్లెడు పున్నమనాటి నిందుజా
బిల్లి సృజించి నీకుఁ గల ♦ ప్రేమకు సూచనఁ జూపి తౌర! నీ
చల్లఁదనం బదెంతటిదా? ♦ సజ్జనజీవన! లోకపావనా! 49

ఉ. జల్లనఁ గీర్తి నీపయినఁ ♦ జల్లిన మల్లెలో! నిజయోత్సవం
బెల్లెడఁ జాటు దీపములో? ♦ యీశ్వర! నీదు విలోకనంబులో?
గొల్లగ మింటఁ జుక్కలన ♦ గోట్లకొలంది వెలుంగు లోకముల్
సల్లలితప్రభావిభవ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 50

ఉ. సూర్యుఁడు నీకుముందు నెఱ ♦ సున్న ప్రతాపమునందుఁ, జంద్రుఁడో
స్థైర్యమువ్రాని చెప్పుటకుఁ ♦ జాలఁడు దా నరసున్న సున్నయో
వీర్యయశంబులందు, వర ♦ ''వింసము బిందులఁ దెల్పఁ జెల్వలో
శౌర్యముఁ జూపఁజాల దని ♦ సజ్జనజీవన! లోకపావనా! 51

ఉ. ధారుణిమీఁద భాస్కరుఁడు ♦ దారుణరశ్ములు వేయు చిమ్మినన్,
గూరుచు శాంతి మేఘములు ♦ గూరిమిఁ గోట్లకొలంది చిమ్ములన్
సారెకు నీప్రభావమున ♦ సర్వదయాపర! భక్తకింకరా!
చారుపవిత్రసచ్చరిత! ♦ సజ్జనజీవన! లోకపావనా! 52

చ. ఖరకరుఁ డెంతతీక్ష్ణముగఁ ♦ గన్నులకున్ మిఱుమిట్లు గొల్పినన్
శిరము నొకింత యెత్తి కడుఁ ♦ జెన్నగు పచ్చనియాకు జొంపముల్
సరగునఁ జూడ నేత్రములు ♦ శాంతిసుధాంబుధి నోలలాడు నీ
శరణము చొచ్చువారివలె ♦ సజ్జనజీవన! లోకపావనా! 53

ఉ. నీదగుసృష్టిచిత్రముల ♦ నెమ్మి గనందగు చారుసౌధముల్
ఖేదము మాఁపు గంధవహు ♦ క్రీడకుఁ జాలిన రమ్యరంగముల్
మోదముగూర్చు వాహినుల ♦ మూలపదంబులు భూరిశైలమున్
సాదరముల్ భవత్కృతులు ♦ సజ్జన జీవన! లోకపావనా! 54

ఉ. భూమికి సారమున్ గొలిపి ♦ పూతశరీరులఁ జేసి స్నాతులన్
ప్రేమను జీవకోటులకుఁ ♦ బెల్లుగ జీవన మిచ్చు నీదయా
స్తోమము గల్గ వెల్వఁదసి ♦ తోయధిఁ గూడెడు నమ్మహానదుల్
స్వామి! భవద్యశోలతలు ♦ సజ్జనజీవన! లోకపావనా! 55

చ. తగు విగతావరోధమునఁ ♦ దద్దయు స్వేచ్ఛ నెలంగుఁ గావునన్
మృగములు పక్షులున్ మది స ♦ రీసృపముల్ ఫలపుష్పవృక్షముల్
సొగసుగఁ జాటు నీప్రభలు ♦ సుందరబంధురమౌ మహాటవిన్
స్వగతస్వతంత్రసౌఖ్యమున ♦ సజ్జనజీవన! లోకపావనా! 56

ఉ. ఇమ్ముగ లేఁజిగుళ్ళు సవి ♦ యింపుగఁ గూసెడు కోకిలావళుల్
ప్రమ్మిన ప్రేమఁ బండ్లఁ దిని ♦ పల్కుల ముద్దులు చిల్క చిల్కలున్,
గమ్మనితేనె నానుచు సు ♦ కమ్ముగ జూస్మని పాడు తుమ్మెదల్,
సమ్మతితో నినున్ బొగడు ♦ సజ్జనజీవన! లోకపావనా! 57

ఉ. తీయనితేనె నానుటకుఁ ♦ దేంట్లకుఁ బూల నొసంగి, కోకిలల్
మేయఁగ లేఁజిగుళ్ళ నిడి, ♦ మించుతమిన్ దినఁ దోరగాయలన్
బాయని ప్రేమఁ జిల్కలకుఁ, ♦ బండ్లను మా కొదవించి, మావి నీ
నాయ మొకింత చూపెడిని ♦ సజ్జనజీవన! లోకపావనా! 58

చ. పనసకుఁ బూలు లేవు; పతి ♦ పండులు పుల్లెకు లేవు; క్రోటనుల్
ననలనుఁ బండ్లు నీవు; కరు ♦ ణామయ! మామిడి పూలఁ బండ్లతోఁ
బెనరుచునుండుఁ జోద్యము గ ♦ దా! భవదీయవిచిత్రసృష్టి యే
జనుఁడు నుతింపఁగాఁ గలఁడు? ♦ సజ్జనజీవన! లోకపావనా! 59

చ. అలరులు పండ్లు క్రోటనుల ♦ యందు ఘటియింపని లోటుఁ బాపఁగా
విలసదనంతవర్ణముల ♦ వెల్గెడు నాకులు వానియందు సం
కలితము చేసి చిత్రముగఁ ♦ గన్నుల విం దొనరించినావు; నీ
సలలితసృష్టి వింత గద! ♦ సజ్జనజీవన! లోకపావనా! 60

చ. ఋతువున కొక్కపూవె తన ♦ యింపును సొంపును జూపుచుండఁగా
సతతము నొక్కతీరున వ ♦ సంతము సేయు గులాబి గావునన్
బ్రతికవి దీనిఁ బువ్వులకు ♦ రాణిగఁ జెప్పుచు నీయశంబు నే
సతమును జాటుచుండెడిని ♦ సజ్జనజీవన? లోకపావనా! 61

ఉ. మొత్తనివిత్తముం గలిగి ♦ మేల్మికరండముఁ బోలు భోజనం
బుత్తమయాచకాళి కిడి ♦ యూర్జితమౌ ఘనకీర్తి సౌరభం
బొత్తుగ దిక్కుల న్నెఱపు ♦ భాగ్యుఁడె నీదగు భక్తుఁ డెంచఁ గా
సత్తెమొ చాటుఁ బాప్ప మిల ♦ సజ్జనజీవన! లోకపావనా! 62

ఉ. పిల్లలు నీకు లాలనము ♦ మాటికిఁ జాటుటచేతనే కదా
తల్లిగఁ గండ్ల కద్దుకొని ♦ చాసలు వేసలి వానిఁ దాల్చుటల్
పిల్లలె గావసేవయిన ♦ పస్నఁ జెందునె నిన్ను వీడి? భా
స్వల్లలితప్రభాపినర! ♦ సజ్జనజీవన! లోకపావనా! 63

ఉ. నీవిధి దాఁటువారలకు ♦ నేరుపుమీఱ ననేకరోగముల్
నీవు సృజించియుంటి మఱల ♦ నీదగు కూరిమి పేర్మితోడ నా
నావిధులన్ బ్రతిక్రియలు ♦ నాథ! మహౌషధులందుఁ గూర్చితో
స్థావరసత్త్వపాభరణ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 64

చ. పఱచెడువానికైనఁ బడక ♦ పట్టుకుఁ జిక్కనివానిజోలికిన్
బఱవక క్షత్త్రులేని తఱి ♦ వన్యమృగంబులజాడఁ బోక భీ
కరతఁ గభీరతన్ గలిగి ♦ కాననసీమల నేలు గాఁ జే
సరిని సృజించినావు గద ♦ సజ్జనజీవన! లోకపావనా! 65

చ. తమతమజట్టు వీడని వి ♦ ధంబున జంతుల నాక్షఁ బెట్టఁగా
సమదమృగోత్కరంబులను ♦ సంసృతిలో సృజియించినావు నీ
క్రమమును దప్పువాని కిల ♦ గట్టిగ ముప్పు ఘటిల్లితీరెడున్
సమధికదుష్టనిగ్రహణ! ♦ సజ్జనజీవన! లోకపావనా! 66

ఉ. కాకము కావు కావు మని ♦ కర్ణకఠోరముగాగఁ గూసినన్
నేకువఁ దెల్పదే? మఱియు ♦ వేయివిధంబులఁ దన్ను దెప్ప నా
కోకిలఁ బెంపదే భువని? ♦ గుంపులకున్ సుగుణాళిఁ గూర్చి యీ
శా! కృపజూపినావు గద ♦ సజ్జనజీవన! లోకపావనా! 67

చ. అతులితశేముషీగరిమ ♦ సద్భుతమై తనరాగ గూడు నం
చితగతిఁ గట్టుచుండుటను ♦ శిల్పిగణంబులు భూమిలోపలన్
బతఁగాల శిల్పిరా జనుచు ♦ బంగరుబిచ్చుకఁ బిల్చు టెల్ల నీ
చతురతచేతఁ గల్గెఁ గద ♦ సజ్జనజీవన! లోకపావనా! 68

ఉ. పక్షము లెప్పుడున్ మెఱుఁగు ♦ బారునికీలిని రాచి దువ్వుకోన్
బక్షికిఁ బుచ్చుకోశమున ♦ భవ్యతరంబుగ పెంచినైలమున్
రక్షణసేసి దువ్వెనఁగ ♦ రాజిలు ముక్కును నీదుకూర్మికిన్
సాక్షిగ నిచ్చినావు గద ♦ సజ్జనజీవన! లోకపావనా! 69

ఉ. పాపముచేత బుద్ధి చెడి ♦ పావన! నీపాడఁ జూడ నోడు నా
పాపిని బోల్చి చెప్పుటకు ♦ భానునిఁ జూడఁగ నోడు గూబన్
జూపితి వౌగ లోకమున ♦ శుభ్రయశోవిభవాభిరామ! సం
స్థాపితసర్వధర్మపథ! ♦ సజ్జనజీవన! లోకపావనా 70

ఉ. పీలిచి ప్రాణవాయువును ♦ బెల్లుగ మే మిడు దుష్టవాతమున్
గ్రోలుచు పంచిగాలి నొడ ♦ గూర్చుచునుండెడు వృక్షజాలముల్
చాల సృజించి నీమహిమఁ ♦ జాటితి వౌర! జగంబులోపలన్
జాలు నెవండు ని న్బొగడ ♦ సజ్జనజీవన! లోకపావనా! 72

ఉ. అన్నిటికంటె ముఖ్యముగ ♦ నాదరువై తనవారి యందఱన్
గన్ననఁ గాచుచుండునది ♦ గాలిగదా యని దాని నింతటన్
బన్నుగ రాజు లెవ్వరును ♦ బన్ననిరీతిని నించినావు నిన్
సన్నుతిసేయఁగాఁ దరమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 73

ఉ. ధాటిగఁ బ్రాణికోటు లిల ♦ దాహము దీర్చుకొనంగఁ ద్రావు నా
నీటిని దేటఁజేయుటకు ♦ నేరుపుమీఱఁగ మానయంత్రముల్
కోటులకొద్దిఁ జేసితివి ♦ కూరిమిలోపల నీకు నెవ్వరున్
సాటియె విశ్వసంభరణ! ♦ సజ్జనజీవన! లోకపావనా 74

చ. పసిఁడిని జేయఁగా నరులు ♦ భస్మములున్ గసము ఘటించినన్
బసిడికిఁ గాక నెక్కుపని ♦ పాటలకున్ ఫలకాంక్షఁ గాచు నీ
యసమకృపావిలాసముల ♦ నంతటఁ జాటెను లోకమందు నీ
జసమె వెలుంగుఁగా సకల ♦ సజ్జనజీవన! లోకపావనా 75

ఉ. పిల్లలు దొర్లుచు న్బడుచుఁ ♦ బెల్లుగ నాడుదు రంచు వారిలోఁ
బల్లవకోమలంబు లన ♦ పాయములౌ నెముకల్ ఘటించి యో
వల్లభ! యెల్లరుం దెలియ ♦ వైఖరిఁ జక్కఁగఁ జాటి తౌర! నీ
సల్లలితార్ద్రచిత్తమును ♦ సజ్జనజీవన! లోకపావనా! 76

ఉ. వెన్ననఁ గాలు మోపి కరి ♦ వెళ్లినవెంటనె యెంతొ వింతగాఁ
దిన్నగఁ జీపు దెప్పిరిలి ♦ తేవఁ దెన్నునుబట్టి పోయెడున్
బిన్నల నెల్ల నెంతయును ♦ ప్రేమ భరింతువు చిత్రరీతినిన్
సన్నుతిసేయ సన్తులమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 77

ఉ. వేసవిలోన గొఱ్ఱెలకు ♦ వేసటఁబాపగఁ దీయు నున్నియే
వాసిగ శీతకాలమునఁ ♦ బాపును మాచలి నిట్టు లిర్వురన్
గాసికిఁ దప్పు మార్గమును ♦ గల్గఁగఁజేసితి వౌర! నీకృపా
శాసన మెన్న మాతరమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 78

చ. రవికిఁ బ్రదక్షిణంబుగను ♦ రమ్యముగా భువి నీవు ద్రిప్పుటన్
బ్రవిమలసౌఖ్యసంపదలు ♦ భవ్యతరంబుగ మాకుఁ గూర్పఁగా
వివిధఋతుల్ గ్రమానుగతి ♦ వింతగఁ గల్గుచునుండు నీకృపన్
స్తవమొనరింపఁగా వశమె? ♦ సజ్జనజీవన! లోకపావనా! 79

చ. చిగురులచీరెఁ గట్టి మఱి ♦ చెన్నలరారెడునట్టి పువ్వులన్
నగలుగఁ దాల్చి భృంగముల ♦ నాదముతోఁ బికకూజితంబులన్
సొగసుగఁ గూర్చి స్వామి నిను ♦ సొంపుగఁ బాడి వసంతలక్ష్మి దా
స్వగతసుఖంబుఁ ♦ జాటుఁగద! ♦ సజ్జనజీవన! లోకపావనా! 80

చ. చనిచని యంతగాననిర ♦ సాతల మంటిన నీటి నూటిగాఁ
దనకిరణాళి గ్రీష్మరవి ♦ తద్దయుఁ బీల్చుటచేత నే కదా
ఘనముగ నెల్లనాళములఁ ♦ గాంచి జలంబు తరుల్ చిగుర్చుటల్
జను లరుదంది నిన్బొగడ, ♦ సజ్జనజీవన! లోకపావనా! 81

చ. మెఱు మను నిప్పు సోఁకఁగనె ♦ మేఘశతఘ్ని భయంకరంబుగా
నుఱుమును గాని జల్లుపని ♦ యుత్తమశీతలసౌఖ్యవృష్టియే
గురియునుగాదె నీకరుణఁ ♦ గూరిమి నెవ్వరు నీసముల్ దయా
శరధివి నీవెగా సకల ♦ సజ్జనజీవన! లోకపావనా! 82

ఉ. పున్నమనాఁటిచంద్రుఁ డను ♦ పూర్ణసుధాకలశంబు చేతిలోఁ
గ్రన్ననఁ దా శరత్కుసుమల ♦ గైకొని నీ కభిషేక మింపుగా
మన్ననతోడఁ జేసెడిని ♦ మాటికి భక్తులు సంతసిల్లగా,
సన్నుతసద్యశోవిభవ! ♦ సజ్జనజీవన! ♦ లోకపావనా! 83

ఉ. సుందరశిల్పకల్పము వ ♦ సుంధర గావున దీనియందమున్
గుందఁగనీయరా దనుచుఁ ♦ గూరిమి నీ వొడగూర్చి కప్పుమే
లొందిన జిల్గుగాసెనఁగ ♦ నొప్పు హిమంబు హిమర్తువందు నీ
చందము లెన్నఁ జిత్రములు; ♦ సజ్జనజీవన లోకపావనా! 84

ఉ. లేమిని మమ్ము వీడకుము ♦ లేదనఁబోకుము మాకు దిక్కు నీ
వే మహానీయ యంచు నిను ♦ నెంతయు వేఁడెదు నగ్నశాఖలం
దామనియందుఁ బూర్ణకృప ♦ నాకులఁ బూల నలంకరింతువో;
స్వామివిగావె యన్నిఁటికి? ♦ సజ్జనజీవన! లోకపావనా 85

ఉ. నిర్వచనీయశక్తియుత ! • నేర్పున గొంగళిపుర్వు నందమై
పర్వఁగ రెక్కలం గలిగి • భాసిలు సుందరకీటకంబుగా
నుర్విని మార్చు నీప్రతిభ • యొక్కటి చాలదె నిన్నుఁ జాటఁగా
సర్వశుభప్రదా ! సకల • సజ్జనజీవన ! లోకపావనా ! 85

ఉ. పేఁచి పిప్పిచేసినను • బెల్లగ ముక్కలుగాఁగఁ గోసినన్
గూలిచి శీర్షము న్నఱకి • క్రూరత గానుగఁ బెట్టి త్రిప్పినన్
జీలిచివేసినన్ మధుర • శీలమె మాపుము భక్తిఁ జాటగాఁ
జాలదె పో భువిం జెఱకు • సజ్జనజీవన ! లోకపావనా ! 86

ఉ. చిన్నని మావుగిం జముఁ • జేయఁగఁ జాలము సర్వలోకముల్
చెన్నగఁ జేయుమంచు నినుఁ • జింతనసేయము కండక్రొవ్వునన్
మిన్నును మన్నుఁ గానము కు • మించెదొ మమ్మదలించి దిద్దెదో
సన్నుతసత్కృపాభవన ! • సజ్జనజీవన ! లోకపావనా ! 87

ఉ. అర్థములేని వస్తు వొక • టైనను గల్గునె నీదు సృష్టిలో?
వ్యర్థులుగా మే మేము పరి • మార్థమున న్బనిసేయ నుండినన్?
స్వార్థములేని సేవలప • రార్థపరుండవు నీవు గావునన్
సార్థులఁ జేయు మయ్య మము • సజ్జనజీవన ! లోకపావనా ! 88

ఉ. పచ్చిక మెత్తిపానుపుగఁ, • బండ్లను దియ్యనివిందుగా సదా
సచ్ఛపుసీరె పానముగ, • హాయిగ సోఁకెడు చల్లగాలియే
నిచ్చలు వీచు వీవనగఁ, • నెమ్మది నెంచుచు నిన్నుఁ గొల్చు సా
సచ్ఛుఁ డుండెడి ధన్యుఁడగు • సజ్జనజీవన ! లోకపావనా ! 89

చ. కలకలలాడు చంద్రుఁ గని, • కాకలఁ జిమ్మెడు సూర్యుఁ గాంచి, వే
జలజలఁ బారు నేఱులను • జల్లఁగ వీచెడు గాలిఁ జూచి, భూ
వలయమునందుఁ బండు పలు • పంటల నగ్గని నీదు దండముల్
సలుపనివాఁడు మానవుఁడె! • సజనజీవన ! లోకపావనా ! 90

ఉ. కోరినవెల్ల నీయ వని • కొందఱు దూషణసేయుచుండ్రు నిన్
గోరినవెల్ల నీ విడినఁ • గూళలమై భువినెల్లఁ గూల్పమే?
కూరిమి నిడ్డ వెన్నఁటినె • కుత్సితమార్గములందుఁ గాల్పమే?
సారథివై పనుమ న్నడవు • సజ్జనజీవన ! లోకపావనా ! 90

చ. వరద ! యసంఖ్యహస్తముల • వారక యిత్తువు నీవు గోరికల్
కరముల రెంట నే నెటులు • గైకొనఁజాలుదునయ్య నీకృపన్
గరములు మోడ్చి నీ కిడెద • గౌరవసూచకమైన దండమున్
సరవిఁ బరిగ్రహింపు మిదె • సజ్జనజీవన ! లోకపావనా! 92

చ. గిరగిర సర్వలోకములఁ • గేలిగ ద్రిప్పెడు నీమహశక్తికిన్
బోరిఁబోరి దుష్టులం బొదివి • బుద్ధిని నేర్పెడు నీదుయుక్తికిన్
సరిసరి భక్తుల న్మనుచు • మానితమైన త్వదీయరక్తికిన్
శరణముజొచ్చి మ్రొక్కెదిని • సజ్జనజీవన ! లోకపావనా ! 93

చ. హృదయసభాస్థలిన్ బరఁచు • హృద్యముగాఁ దనరారు భక్తి యన్
సదమలభద్రపీఠమున • స్వామిని నిన్ను వసింపఁజేసి స
మ్మదమునఁ గొల్చి ధన్యుఁడయి • ముక్తిని నేను జెలంగు టెన్నడో?
సదయ ! నిరంతరాభ్యుదయ ! సజనజీవన ! లోకపావనా ! 94

ఉ. మాఱును జంద్రుఁడున్ రవియు • మాఱు గ్రహంబు లుపగ్రహంబులున్
మాఱును జంతుసంతతులు • మాఱును మానవజాతిరీతులున్
మాఱును సర్వ ; మెన్నటికి మాఱనివాఁడవు నీవుమాత్రమే
సారెకు వెల్గుచుండుదువు • సజ్జనజీవన ! లోకపావనా ! 95

ఉ. ఆకసమందు మేఘము మ • హాద్భుతరీతిని మాఱునట్లు లో
కైకశరణ్య ! నాహృదయ • మక్కట మాటికి మాఱుచుండెడిన్
నీకరుణాకటాక్షమున • నిర్మలము న్దిరమౌను గాక యీ
శా ! కరుణాసుధాకలశ ! సజనజీవన ! లోకపావనా ! 96

ఉ. ఎచ్చట నుండినన్ మఱియు • నేగతి నుండిన నేమి చేసినన్
బొచ్చెములేని భక్తి నినుఁ బూతచరిత్రుని గొల్వనిచ్చి నా
యిచ్చను దీర్పుమయ్య పర ♦ మేశ్వర ! న న్నెడనాడకయ్య నీ
సచ్చరితంబె పాడెదను ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 97

ఉ. త్యాగము భోగముం గలిగి • ధర్మపథంబునఁ బీఠికాపురిన్
దాఁ గృప నేలు సూర్యనర ♦ నాథుని నాతనిరాణి ధీమణిం
బాగుగ వారు గన్న సుతు ♦ మారుని గూరిమిఁ బ్రోవుమయ్య నిన్
సాగిలి మ్రొక్కి వేడెదను ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 98

ఉ. అందఱు నీకు భక్తులయి ♦ యంచితరీతి దయార్ద్రచిత్తులై
సుందరసద్గుణాభరణ ♦ శోభితులై ధరణీతలంబు నా
నందమయంబుగా సలిపి ♦ నర్మిలి వర్ధిలుచుండ్రు గాక స
త్సాంద్రయశోవిశాలురయి ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 99

చ. జయజయ భక్తకోటినుత ! ♦ చారువిశాలయశోవిరాజితా !
జయజయ ఘోరపాపహర ! ♦ సర్వశుభంకర ! దుష్టభీకరా ?
జయజయ భూరిశాంతికర ! ♦ సాధుమనోహర ! సత్కృపాకరా!
జయజయ పూర్ణ ! శ్రీసదన ! ♦ సజ్జనజీవన ! లోకపావనా ! 100



# మానవసేవ

మత, సంఘ, పరిశ్రమ, భాషావిషయములఁ బ్రచురించు సచిత్రమాసపత్రిక.

మ. "గరిమన్ స్వర్ణ మనేకభూషణములన్ గన్పట్టు చందంబునన్
బరమాత్ముం డఖిలప్రపంచమయుఁడై భాసిల్లు గానన్, జరా
చరరూపోజ్జ్వల సర్వభూతములకున్ సంప్రీతిఁ గల్గించుచున్
నిరతిన్ మానవసేవ సర్వజనముల్ నిత్యంబు సేయందగున్"

భూమండలమున మనభరతఖండము తక్క తక్కిన దేశములెల్ల నిక్కాలమున నాగరికాగ్రగణ్యములై సమస్తసంపదలతోను సంతతసౌఖ్యములతోను నిత్యకళ్యాణములతోను దులదూగుచు భూలోకస్వర్గములవలె భాసిల్లుచున్నవి. నిన్న మొన్నటివఱకుఁ గన్నులు తెఱవక యనాగరికులై యున్న విదేశీయులెల్ల సృష్ట్యాదినుండియుఁ గాఢాతిగాఢ మనుభవించుచున్న గాఢనిద్రనుండి మేల్కాంచి కాలప్రభావమున నింద్రజాలమునం బలె నొకపెట్టున మహోన్నతపదవి నందుచున్నారు.

అనేకశతాబ్దములకుఁ బూర్వమే మహామేధావంతులు శమదమాలంకృతులుఁ ద్రికాలజ్ఞులుఁ దపస్స్వాధ్యాయనిరతులు నగు మహర్షులచేతను, సత్యసంపన్నులుఁ బ్రజానురంజకులు ధర్మస్వరూపులు తేజోవిరాజితులు నగు చక్రవర్తులచేతను, నీతిమంతులు దేశభక్తులుఁ బరోపకారపారీణులు నగు ప్రజలచేతను; మానవతులు జ్ఞానవతులు పతివ్రతలు నగు విదుషీమణులచేతను; బ్రకాశించుచు జగజ్జేగీయమానమై సకలలోకగురుపీఠము నధిష్ఠించిన మనభారతవర్షము నేఁడు కళావిహీనమై యంధకారబంధురమై యధఃపతితమగుచున్నది.

"ఏకమేవాద్వితీయంబ్రహ్మ" యని బోధించిన మన మిప్పుడు బహుదేవతారాధనముఁ జేయుచున్నారము. "బ్రహ్మైకవ్యాపీ కేవలమ్" మ్మని యుపదేశించిన మనము విగ్రహముల నుపాసించుచున్నారము. "ఆత్మవత్సర్వభూతాని" యని చెప్పిన మనము శాఖాభేదములకై పెనఁగులాడుచున్నాము. "అహింసాపరమో ధర్మః" యని వక్కాణించిన మనము పరహింసయే జీవనముగాఁ జేసికొనుచున్నారము. "నమాతుః పరదైవతం" మ్మని శాసించిన మనము మాతృపూజను మఱచినారము. "విద్యాహీనః పశుః" అని తెలిపిన మనము విద్యలను విడనా చేసారము.

